ఓ3మ్ ఓ3మ్ ఓ3మ్ ఓ3మ్ ఓ3మ్ ఓ3మ్ ఓ3మ్ ఓ3మ్ ఓ3మ్ ఓ3మ్ ఓ3మ్ ఓ3మ్ ఓ3మ్ ఓ3మ్ ఓ3మ్

ఓ3మ్

# నూతన సంవత్సరము ఎప్పుడు ?

రచయిత

**ఆచార్య ఉదయన:**

సంస్థాపకులు, అధ్యక్షులు

నిగమ నీడమ్-వేదగురుకులమ్

(9440721958)

ప్రకాశకులు

**వేదధర్మ ప్రచార సమితి**

నిగమ నీడమ్-వేదగురుకులమ్

మహర్షి దయానంద మార్గం

గ్రా॥ పిడిచెడ్, మం॥ గజ్వేల్

జి॥మెదక్ (తెలంగాణ) 502278

ప్రథమ ముద్రణ

ఫాల్గుణ 2072

మార్చ్ 2015

మూల్యం

**15/-**

ప్రతులు : 3000



**ప్రతులకు :**

1. నిగమ నీడమ్ (వేదగురుకులమ్), మహర్షి దయానంద మార్గం. పిడిచెడ్, గజ్వేల్, మెదక్ -502278. nigamaneedam@gmail.com
2. మురళి బ్రహ్మచారి, ఆర్యనిలయం, 9-2-586, జూలమ్మగుడికి ఎదురుగ, రెజిమెంటల్ బజార్, సికింద్రాబాద్-25. (9441033702)
3. ఆర్యసమాజం, సీతాఫల్‌మండి, సికింద్రాబాద్-500061.
4. మడ్డి రమణయ్య, 103, శ్రీలతా టవర్స్, 2-10-830/2, కోర్ట్ రోడ్, కరీంనగర్- 505001 (09963162496).
5. పతంజలి ఆయుర్వేద ఆరోగ్యకేంద్రం, శ్రీరామకాలని, పాత బాన్సువాడ రోడ్డు, బాన్సువాడ-503187 (9494026684)
6. శ్రీ గోపాల్ బుక్‌హౌస్, 3-3-860, సుల్తాన్ బజార్ ఆర్యసమాజం ఎదురుగా, కాచిగూడ, హైద్రాబాద్-27 (040-24658101).

అక్షర సంయోజనం & ముఖపుట చిత్రీకరణం (డీ.టీ.పీ.)-
**బ్రహ్మచారి దేవశ్రుత్ చైతన్య, బ్రహ్మచారి ధర్మేంద్ర చైతన్య**
నిగమ నీడమ్-వేదగురుకులమ్, పిడిచెడ్, గజ్వేల్.

**ముద్రణ:-**విక్రాంత్ ప్రింట్ హౌస్, 12-11-735, వారసిగూడ X రోడ్, సికింద్రాబాద్-500061. ఫోన్: 9705085608.

# ప్రకాశకీయము

**"గతానుగతికో లోకో న లోక: పారమార్థిక:"** ఒకరిని చూసి మరొకరు ప్రవర్తిస్తారు, వ్యవహరిస్తారు. ఇంతకు మించినది ఈ లోకంలో పరమార్థం అనగా సాధించదగిన విశేష ప్రయోజనము ఏమి లేదు అని ఆ వాక్యానికి అర్థము. జన్మించిన తరువాత మాట్లాడటం, భుజించడం, చదువడం, సంపాదించడం, వివాహం, సంతానోత్పత్తి వంటివన్ని ఒకరి అనుకరణతోనే జరుగుతుంటాయి. ఇలాంటి మానవ జీవనాన్ని పశుతుల్యమని అన్నారు మన శాస్త్రకారులు. ఇట్టి జీవన విధానం మానవో- చితమైనది కాదు. మానవుడనగా **"మననాద్ మనుష్య:"** ఆలోచించి వివేకంతో ప్రవర్తించు వాడే మానవుడు అనబడుతాడు. అనుకరణ అనేది మానవునికి అవసరమే, కానీ అంధానుకరణం అనుచితం. కావున పరిణామాన్ని ఆలోచించే ముందడుగు వేయాలి. ఎవరినైతే మనము అనుకరిస్తున్నామో వారి జీవన సఫలతను, నిష్ఫలతను గ్రహించాలి. అప్పుడు గాని మానవుడు జాగరూకుడై తన జీవన లక్ష్యాన్ని సాధించగలుగుతాడు, అస్తు.

మానవుడు ధార్మిక కృత్యాలనూ, పండుగలనూ ఇతరులను అనుసరించే జరుపుకుంటాడు. కాని వాటి చరిత్ర, మహత్వాదులను ఎఱుగడు. పండుగ అంటే ఏమిటి? వాటినెందుకు జరుపుకోవాలి? వాటి ఉద్దేశ్యమేమిటి? వాటి స్వరూపమేమిటి? అనగా ప్రతి పండుగను ఏ విధంగా జరుపుకోవాలి? వాటిని యథావిధిగా జరుపుకోవడం వలన కలుగు లాభాలేమిటి? విపరీతంగా జరుపుకోవడంలో కలుగు నష్టా- లేమిటి? మనము జరుపుకొను పండుగపద్ధతి ప్రాచీనమైనదా? లేదా సమాజంలో క్రొత్తగా కల్పించి ప్రవేశపెట్టిన పద్ధతియా? నేటి పండుగలు వేదాది శాస్త్రాలకు అనుకూలమైనవా? ప్రాచీనకాలంలో ఋషులు- మునులు, రాజులు-మహారాజులు పండుగలను ఏ విధంగా జరుపు- కొనేవారు? అను విషయాలను తెలుసుకొని ఆ పరంపరను అనుసరిస్తే నేటి మానవ సమాజానికి ఎంతో మేలు చేకూరును, సుఖ-శాంతులు కలుగును. పాఠకులెల్లరు ఈ విషయాన్ని విశేషంగా గ్రహిస్తారని ఆశిస్తూ....



# నూతన సంవత్సర సంబరము ఎప్పుడు? ఎందుకు?

జనవరి-1 సమీపించగానే చిన్నవారు-పెద్దవారు, ప్రబుద్ధులు- సామాన్యులు, స్త్రీలు-పురుషులు అందరూ హర్షఉల్లాసాలతో నూతన సంవత్సరానికి స్వాగతం పలుకుటకు సన్నద్ధులవుతారు. నలువైపుల నూతన సంవత్సర శుభాకాంక్షలు తెలియజేయిటకు బ్యానర్లు, బోర్డులు, లైట్లు, ముగ్గులు లాంటి ఇంక ఎన్నో అలంకరణలు ఆవరింపబడుతాయి. రాత్రంత మేలుకొని పాత సంవత్సర చిట్టచివరి నిమిషము గడిచి నూతన సంవత్సర క్షణము ముందర నిలవగానే ఆబాలవృద్ధులందరూ నృత్యగానాలతో తుపాకిపటాకుల ధ్వనులతో దిగదిగంతరములను ధ్వనింపజేస్తూ, సందడిస్తూ ఘనమైన స్వాగతమును సలుపుచూ అపరిమిత అనందమును అనుభవింతురు.

ఓ భారతమాత మానసపుత్రులారా! ఇది (జనవరి-1) నూతన సంవత్సరమేనా? అని మీ అంతరాత్మలో ప్రశ్నించుకోండి. ప్రస్తుతము ప్రచలితమైయున్న కాలేంద్ర (కాలెందర్-క్యాలెండర్ ),= కాలాంతరము క్రీస్తుకు సంబంధించినదని అందరికి తెలిసిన విషయమే కదా! క్రీస్తుకు పూర్వము మన దేశవైభవము, పరంపర, సంస్కృతి, చరిత్రలు ఏమీ లేకుండెనా? ఉంటే వారు ఏ రోజున నూతన సంవత్సరమును జరుపుకునేవారో? ఆలోచించండి, ఆత్మమంథనం చేసుకోండి. మంథన ప్రశస్తమార్గమును మేము ఇచట కొన్ని ప్రముఖ విషయాలతో సూచన ప్రాయంగా ప్రస్తావించుచున్నాము.

యూరోప్ దేశాలలో పూర్వము ఓలంపియన్ సంవత్సరం ప్రచలి- తంగా ఉండింది. ఆ సంవత్సరమే క్రీస్తుకు 753సం॥లకు పూర్వం రోమ-

నుల రాజ్యం స్థాపించబడిన తరువాత రోమనుల మొదటి రాజు రోములుస్ కాలంలో రోమన్ సంవత్సరంగా రూపొందినది. అప్పుడు ఆ సంవత్సరంలో కేవలం పది నెలలు (మార్చ్ నుండి డిసంబర్ వరకు) మరియు 304 రోజులు మాత్రమే ఉండేవి. రోమన్ దేవతల మరియు మహారాజుల నామములతో నెలల నామములను వారు ప్రసిద్ధి గావించిరి. ఉదాహరణకు "మార్స్" రోమనుల యుద్ధ దేవత పేరుతో "మార్చ్" నెల, అట్లస్ దేవత కుమార్తెలైన "మలికా మఈ", "మలికా జౌన్"ల పేర్లతో క్రమంగా "మే", "జూన్" నెలలు, రోమన్ సమ్రాట్ జులియస్ సీజర్" మరియు అతని మనుమడైన "ఆగస్టస్ సీజర్" పేర్లతో "జులై" "ఆగస్ట్" నెలల నామములను నిలిపిరి. ఈ విధంగా మొదటి నెల మార్చ్ నుండి ఆరవనెల ఆగస్ట్ వరకు పేర్లు పేర్కొనబడినవి. తదుపరి నెలలకు క్రమబోధక శబ్దములతో నామములను సల్పిరి. సప్తమ (ఏడవ) మాసమునకు సెప్టెంబరని, అష్టమ (ఎనిమిదవ) మాసమునకు అక్టోబరని, నవమ (తొమ్మిదవ) మాసమునకు నవంబరని, దశమ (పదవ) మాసమునకు డిసంబరని ప్రకటించిరి. సెప్టంబర్ మున్నగు నామములు సప్తమాది సంస్కృతశబ్దముల నుండి వికృతమై ఉత్పన్నమైనవే అని ఇచట గ్రహించగలరు. సప్తమ అంబర్ (ఏడవ ఆకాశము) శబ్దముతో 'సెప్టెంబర్' ఏర్పడినది. అదేవిధంగా, అష్టమ అంబర్ (ఎనిమిదవ ఆకాశము)తో 'అక్టోబర్', నవంబర్‌కు నవమ అంబర్ (తొమ్మిదవ ఆకాశము)తో 'నవంబర్', దశమ అంబర్ (పదవ ఆకాశము)తో 'దిశంబర్' అనుశబ్దములు ఏర్పడినవి. నవమ అంబర్ అను శబ్దాలు ఆకాశములోని నక్షత్రాదుల స్థితిగతులను తెలియజేసే శబ్దాలు, అస్తు.

మార్చ్ మున్నగు పదినెలలే 53 సం॥ల వరకు వ్యవహరించ–



బడినవి. క్రీస్తుకు 700 సం॥లకు పూర్వము రోమనుల రెండవ రాజు అయిన "నూమా పాంపిలియస్ (Numa Pompilius)" జోనస్ అనే రోమన్ దేవత పేరుతో జనవరి, అదేవిధంగా ఫిబ్రవరి (ప్రాయశ్చిత్త మాసమని దీనికి అర్థము) నెలలను నూతనంగా కల్పించి మొదటినెల మార్చ్‌కు పూర్వము చేకూర్చెను. రోమనుల ఐదవ రాజు'ఎత్రుస్కాన్ తార్క్వినియుస్ ప్రిస్కియుస్'( Etruscan Tarquinius Priscius; 616–579 క్రీస్తుకు పూర్వం) రోమన్ రిపబ్లికన్ క్యాలండర్‌ను ముద్రించి ప్రచలితము చేశాడు. దానిలో జనవరికి మొదటి నెలగా స్థానము ఇవ్వబడింది. ఈ రెండు నెలలను పదవనెల డిసెంబర్ తరువాత చేకూర్చిన బాగుండేది. వాటిని ప్రారంభంలో చేర్చడం వలన ఎడవ నెల సెప్టంబర్ తొమ్మిదవ నెలగా, ఎనిమిదవనెల అక్టోబర్ పదవ నెలగా, తొమ్మిదవ నెల నవంబర్ పదకొండవ నెలగా మరియు పదవ నెల డిసెంబర్ పంన్నెండవ నెలగా మారిపోయాయి. దీనితో సెప్టంబర్ (సప్తమ అంబర్=ఏడవ ఆకాశము) మున్నగు శబ్దములకు అర్థం లేకుండా పోయెను. 'మార్చ్' అనే శబ్దానికి ఇంగ్లీష్ భాషలో 'గమనాగమనము' అని అర్థం కలదు. అనగా పాత సంవత్సరము గడిచి పోయినది, నూతన సంవత్సర ఆగమనము ఆరంభ మగుచున్నది అని దానికి అర్థము. జనవరి, ఫిబ్రవరి నెలలను ఆరంభములో చేకూర్చడం వలన 'మార్చ్' శబ్దానికి ఉన్న అర్థం వ్యర్థ మయిపోయినది. ఇది అజ్ఞానానికి, అవైజ్ఞానికతకు మంచి ఉదాహరణ. ఫిబ్రవరి నెలలో 28 లేదా 29 రోజులే ఎందుకు? కాలపరిగణనలో ఏమైనా హెచ్చుదగ్గులు ఉంటే అది సంవత్సర చివరిలో సవరించబడాలి. అప్పుడే గాని ఫిబ్రవరి శబ్దానికి ఉన్న అర్థం సార్థకమవుతుంది, బుద్ధిసమ్మత మవుతుంది. కానీ సంవత్సర మధ్యలో అనగా రెండవ నెలలో కాలపరి–

గణను సవరించడము (Adjustment) ఎంత వరకు సమంజసము. దీనితో స్పష్టమగుచున్నది ఏమనగా జనవరి, ఫిబ్రవరి నెలలు డిసెంబర్ తరువాత చివరిలో వ్యవహరించ దగినవిగా గమనించవచ్చు.

భారతీయ ప్రాచీన పరంపర ననుసరించి నూతన సంవత్సరం చైత్ర శుక్ల ప్రతిపద రోజున ప్రారంభమవుతుంది. అది దాదాపుగా మార్చ్ నెల చివరిలో లేదా ఏప్రేల్ ప్రారంభంలో వస్తూ ఉంటుంది. ఈ విధంగా చూస్తే మార్చ్ నుండి నూతన సంవత్సరమును ప్రారంభం చేయు రోమన్ పరంపర భారతీయ పరంపరకు అత్యంత సమాన పోలికలు అగుపడుచున్నాయి. అది భారతీయ సంస్కృతిని అనుసరించినట్లు అవుతుందని భావంచి తమ క్రైస్తవ సంప్రదాయాన్ని వైదిక సంస్కృతితో వేరుపరుచే దురుద్దేశ్యముతో రోమన్ సమ్రాట్ నూమా పోంపిలియస్ జనవరి, ఫిబ్రవరి నెలలను మార్చ్‌కు పూర్వము చేకూర్చాడు. దీనితో రోమన్ సంవత్సరం 304 రోజులకు బదులుగా (304+ 31+28=) 363 రోజులుగా రూపొందింది. దీనిలో కొన్ని నెలలు 30రోజులుగా, మరికొన్ని 31రోజులుగా, ఫిబ్రవరి నెల28 లేదా 29 రోజులుగా విభజింపబడినాయి. జూలియస్ సీజర్, ఆగస్టస్ సీజర్ మహారాజుల పేర్లతో ఏర్పడిన జులై, ఆగస్ట్ నెలలను వరుసగా 31-31 రోజులుగా పెట్టుకొన్నారు. ఈ విధంగా సంవత్సర మొదటిదినము, మాసవిభాగం, మాసపరిమాణం, మాసముల వరుస ఇవన్నియు స్వార్థభావనలతో, దురుద్దేశ్యాలతో ప్రారంభించబడి మతోన్మాదముతో మానవసమాజానికి రుద్దబడినవే తప్ప, బుద్ధిసమ్మతమైనవి కావని తేటతెల్లమగుచున్నది.

రోమన్ క్యాలెండర్‌లోని 12 నెలల పేర్లు క్రింది క్రమంగా ఉండెను-



| | | |
|---|---|---|
| Januarius (31) | Maius (31) | September (30) |
| Februarius (28/29) | Junius (30) | October (31) |
| Martius (31) | Quinctilis (31) | November (30) |
| Aprilis (30) | Sextilis (30) | December (30) |

క్రీ॥పూ॥ 44 వ సంవత్సరములో సమ్రాట్ జులియస్ సీజర్ (Julius Caesar) సమ్మానంలో Quinctilis నెల పేరును Julius (July) గా మార్చారు. క్రీ॥పూ॥ 8వ సంవత్సరములో సమ్రాట్ అగస్టస్ స్వయం Sextilis నెలను తన నామముతో అనగా Augustus (August) పేరుతో వ్యవహరింపజేసాడు. పూర్వం Sextilis నెలలో 30 దినములే ఉండేవి. కానీ తన పేరుతో ఏర్పడిన మాసములో జులియస్ సీజర్ పేరుతో ప్రసిద్ధమైన Julius(July) నెలకు సమానంగా ఉండాలి అని భావించి 30కి బదులుగా August నెలను 31 దినములుగా మార్చాడు. ఈ ఒక్క దిన సవరణ(Adjustment) కొరకు ఫిబ్రవరి నెలను 29 రోజులకు బదులుగా 28 రోజులుగా మార్చాడు. ఈ క్యాలెండర్‌లో ఉన్న కొంత కాలదోషాన్ని సవరించి "పోప్ గ్రేగరి" ఒక వినూతన క్యాలెండర్‌ను ప్రకాశింప జేసెను. ఈ క్యాలెండరే 1582 క్రీ॥సం॥ నుండి ప్రముఖ పలు దేశాలలో అమలులోకి వచ్చింది. ఈ గ్రేగారియన్ క్యాలెండర్ ఏ ఏ దేశములో ఎప్పుడెప్పుడు అమలులోకి వచ్చిందో ఈ క్రింది పట్టిక ద్వారా గమనించవచ్చు-

| సంవత్సరము | | దేశముల పేర్లు |
|---|---|---|
| 1582 | క్రీ॥సం॥ | ఫ్రాన్స్, ఇటలి, లక్సేంబర్గ్,పుర్తగాల్,స్పేన్. |
| 1583-1812 | క్రీ॥సం॥ | స్విట్జర్లాండ్. |
| 1584 | క్రీ॥సం॥ | జర్మన్(రోమన్ కైథోలిక్), బెల్జియం, |

నేదర్‌ల్యాండ్‌లోని కొన్ని ప్రాంతాలలో.

1587 క్రీ॥సం॥ హంగరి.

1699–1700 క్రీ॥సం॥ డెన్‌మార్క్, డచ్, జర్మన్ ప్రొటెస్టెంట్.

1776 క్రీ॥సం॥ జర్మని.

1752 క్రీ॥సం॥ బ్రిటేన్, అమెరికా.

1753 క్రీ॥సం॥ స్వేడేన్.

1873,1875 క్రీ॥సం॥ జాపాన్, మిస్ర్.

1912–1917 క్రీ॥సం॥ అల్బానియా, బుల్గారియా, చైనా, ఎస్తోనియా,లాతవియా,లిథుఆనియా, రోమానియా,తుర్కి, యుగోస్లావియా.

1918, 1923 క్రీ॥సం॥ సోవియత్ రూస్, గ్రీస్.

భూగోళ–ఖగోళవిజ్ఞానముతో,ప్రాకృతిక సంఘటనలతో, సూర్య–చంద్ర–గ్రహ–నక్షత్రాల స్థితి–గతులతో ఈ క్యాలెండర్‌లోని నెలలకు ఎలాంటి సంబంధం లేదు. అందుకే మార్చ్‌కు పూర్వము జనవరి,ఫిబ్రవరి నెలలను అమర్చినా సంవత్సరాదిగా జనవరి–1ని జనులు జీర్ణించుకోలేక పోయారు. మార్చ్–25 రోజునే సంవత్సరాదిగా, నూతన సంవత్సరంగా కొనసాగిస్తూ వచ్చారు. 1582 క్రీ॥సం॥నుండి జనవరి–1 నూతన సంవత్సరంగా అములులోకి వచ్చింది.

ఆంగ్లేయులు ఈ క్రీస్తు సంవత్సరమును అనగా జనవరి–1ని నూతన సంవత్సరంగా జరుపుకొను పద్ధతిని మన భారతదేశంలో 1752 క్రీ॥సం॥ లో ప్రవేశపెట్టారు. భారతీయ పరంపరను నశింపజేయడానికి ఆయాస–ప్రయాసలుపడి ఎన్నెన్నో ప్రయత్నాలు చేపట్టిన ఆర్థికసంవత్సరము (Financial year) మరియు విద్యాసంవత్సరము (Educational



year) ఇప్పటికి ఎప్రేల్–1 నే జరుపుకొంటున్నారు. దీనిని మార్చలేకపోయారు. ఎందుకనగా ఇవి జనాల వ్యవహారానికే గాక ప్రభుత్వశాసనానికి అభిన్న అంగముగా ఉండిపోయాయి. ఇది యుగాది (ఉగాది)కి, భారతీయ పరంపరకు సన్నిహితమైనది, వైజ్ఞానికమైనది, బుద్ధిసంగతమైనది. కాని ఏప్రెల్–1ని మూర్ఖులదినము (Foolish day)గా ప్రచలితము చేయనారంభించిరి. దీనికి కారణం–1582 క్రీ॥సం॥లో ఫ్రాన్స్ దేశంలో ఆ దేశ పదవరాజు "చార్ల్స్" జనవరి–1ని సంవత్సరాదిగా ప్రకటించినా జనులు ఆ రాజాజ్ఞను పాటించక ఎప్రెల్–1నే సంవత్సరాదిగా వ్యవహరించారు. దానితో చార్ల్స్ క్రుద్ధుడై రాజాజ్ఞను ఉల్లంఘించిన వారినందరిని మూర్ఖులుగా ఘోషించాడు. దానితో కాలాంతరంలో జనులందరికి జనవరి–1నే సంవత్సరాదిగా అంగీకరించవలసి వచ్చింది. ఈ సాఫల్యాన్ని చూసి భవిష్యత్తులో మళ్ళీ ఎప్రిల్–1 సంవత్సరాదిగా గుర్తించబడకుండా ఉండేందుకు ఆ దినమును 'మూర్ఖులదినంగా' జరుపుకొను పద్ధతిని వ్యవహరింపజేశాడు "చార్ల్స్". మనమేమో దానిని గ్రహించక జన్మాంధులుగా అనగా గొర్రెదాటులుగా వారిని అనుసరిస్తూ, సరదాలాడుతూ, పరస్పరం మూర్ఖులుగా చేస్తూ తమను తాముగా మూర్ఖులమని, అజ్ఞానులమని తెలియపరుచుకుంటున్నాము. ఇట్టి సమాజం మరెచ్చటను కానరాదు. ప్రతి మానవుడూ తనకు తాను ఇతరులకంటే గొప్పవానిగా భావిస్తాడే కానీ హీనునిగా, మూర్ఖునిగా ఎన్నడునూ భావించడు. పరస్పరం, ఒకరినొకరు తమతమ జ్ఞానాన్ని ఆదానప్రదాన మొనర్చడమే ఉత్తమ సమాజ లక్షణం. కాని పరస్పరము అజ్ఞానులుగా ఆలపించడం బుద్ధిమంతులకు తగని వ్యవహారము, తస్మాజ్జాగ్రత్త. కావున అట్టి బుద్ధిహీన ప్రవర్తనలతో సావధానులు కండి.

ఏప్రేల్–1కి బదులుగా జనవరి–1ని foolish Day గా మార్చి తమ వివేకతను వెలిబుచ్చండి.

జనవరి–1 అర్థరాత్రికి చలి తన సంపూర్ణ యౌవ్వనంలో ఉండును. అంతట దాని ప్రతాపమే తాండవించు చుండును. మొక్కలు, వృక్ష–వనస్పతులు, లతగుల్మములన్నియూ రసవిహీనములై, వాడిపోయి ముడుచుకొని ఉండును. పుష్పముల వికాసము ఎచ్చటను కానరాదు. పశు–పక్ష్యాదులు చలిప్రకోపముతో నరక బాధలను అనుభవించు చుండును. మృత్యువు వాటిల్లినట్లుగానే వణికిపోవుచుండును. అట్టి విషాదకరమైన, దు:ఖమయ సమయంలో క్రొత్త సంవత్సరాన్ని అంగీకరించడం బుద్ధిమంతులకు తగునా? ఆలోచించండి. ఇది మూర్ఖత్వం కాదా?

దినప్రారంభము అర్థరాత్రికాదు. అది సూర్యోదయమునకు సంబంధించినది. సూర్యోదయానికి దాదాపు 3గం॥కు పూర్వము (3A.M.) దినమునకు సంబంధించిన మొదటి ప్రహరము ప్రారంభమగును. అప్పుడే పశుపక్ష్యాదులు మేలుకొని శాంత, ప్రశాంత, నిశ్శబ్ద వాతావరణాన్ని స్వస్వ మనోహర మధుర ధ్వనులతో వ్యాపింపజేయును. ఆ ధ్వనులతో ఋషులు, మునులు, యోగులు మేలుకొని ధ్యానమగ్నులవుదురు. అందుకే దీనికి బ్రాహ్మముహూర్తమని పేరు. రైతులు వ్యవసాయ పనులలో నిమగ్నులవుదురు. ప్రపంచమంతట క్రియాశీలత, సక్రియత అగుపడును. రాత్రి ముడుచుక పోయిన ఆకులు, పుష్పములు వికసించును. ప్రాణుల శరీరములలోనూ ఒక విశిష్టమైన చైతన్యము సంచరించును. మానవుల హృదయగతి, రక్త ప్రసారణగతి తీవ్రమగును. అందుకే 80% హృదయరోగులకు ఇదే సమయమున హృదయాఘాతము



(గుండెపోటు) జరుగును. ఈ బ్రాహ్మముహూర్తములోనే మానవులందరునూ మేలుకోవాలి. ఈ దివ్య ముహూర్తములో శయనించు వారి ఆయుష్షు క్షీణించును. శక్తి సామర్థ్యాలు నశించును, బుద్ధి భ్రష్టమగును, సోమరితనము పొంగిపోవునని శాస్త్రాలన్నీ చాటి చెప్పుచున్నాయి. ఇట్లు ఈ జడ జగత్తు, పశు–పక్ష్యాదులు, మానవుల అనుభవము, శాస్త్రాదులన్నీ బ్రహ్మముహూర్తముతో దినము ప్రారంభమగునని వెలిబుచ్చగా, దీనికి విరుద్ధంగా రాత్రి 12గం॥ల తరవాత దినం, నూతన సంవత్సరం ఆరంభమగునని తలంచడము అజ్ఞానానికి ప్రతీకం కాదా? మేధావులయిన భారతీయులకు పాశ్చాత్య సభ్యతలను అనుసరించి పశుపక్ష్యాదులకంటే హీనంగా, ఏమాత్రం విచక్షణ జ్ఞానం లేకుండా ప్రవర్తించడం తగునా? దీపములను వెలిగించి ప్రకాశముతో ఆనందానుభూతిని పొందే సంస్కృతి మనది. దీపములను ఆర్పివేసి చీకటిలో చిగురించే, సంతోషపడే సభ్యత పాశ్చాత్యులది. నలువైపుల ఘనఘోర అంధకారము ఆచ్ఛాదితమైన అర్థరాత్రి మానవులే కాదు పశుపక్ష్యాదులున్నూ అత్యంత గాఢ నిద్రలో నిమగ్నమయి వుంటాయి. ఎచ్చటను చైతన్యము సంచరించదు. క్రియాశీలత కానరాదు. అట్టి సమయంలో నూతన సంవత్సర మొదటిదినం ప్రారంభమగునని తలంచుట, భావించుట ఆజ్ఞానం, అవివేకం, విజ్ఞానానికి విరుద్ధం. ఒక సూర్యోదయం (బ్రహ్మముహూర్తం) నుండి మరో సూర్యోదయం వరకు మధ్యలోని సమయాన్ని జ్యోతిషశాస్త్రాలలో సావనదినము అని అందురు. మధ్యరాత్రి నుండి దినం ప్రారంభమగునట్లు శాస్త్రాలలో ఎక్కడనూ వర్ణన లేదు. కావున భారతమాత మానస పుత్రులైన ఓ మానవులారా! మేలుకొనండి ఆలోచించండి.

# యథార్థ నూతనసంవత్సరము

జనవరి–1 ఎట్టి పరిస్థితిలోనూ సంవత్సరమునకు మొదటి దినము కాజాలదని తెలిసి కొంటిమి. మరి నూతన సంవత్సరమేది? ఈ ప్రశ్నకు సమాధాన పరుచుటకు పూర్వం మరికొన్ని ప్రశ్నలు మనస్సును ముట్టడిస్తాయి. దినము, సూర్యోదయ మనునవి ఎప్పుడునూ వినూత్నం–గానే వస్తాయి. పాతవిగా ఎప్పుడునూ రావు. నేటి సూర్యోదయము నిన్నటి సూర్యోదయానికి భిన్నమైనదే. ఈ సూర్యోదయం భవిష్యత్తులోనూ మళ్ళీ రాదు. ప్రతి సూర్యోదయం భూతభవిష్యత్తులకు సంబంధము లేకుండా నిత్యనూతనంగానే ఉద్భవిస్తుంది. ప్రతి దినమూ నూతనమే అయినప్పుడు నూతనసంవత్సరానికి అర్థమేమిటి? సంవత్సరములోని ప్రతి దినమును పాతదిగా చూసేవారు ఒక్క దినమును నూతనముగా ఎట్లు దర్శించుకోగలరు ? ఇట్టి వెర్రి ప్రశ్నలు వేసేవారు ఈ లోకంలో లేకపోలేరు. నీ జన్మదినము ఏది? అని తిరిగి ప్రశ్నించగా అతను సంవత్సరములోని ఏదో ఒక దినమును తన జన్మదినంగా సమాధాన మిచ్చును. అనగా అది ఆ వ్యక్తికి మొదటి దినమని అర్థం. ఆ రోజునే అతను క్రొత్త సంవత్సరములో ప్రవేశించును. అది ఆ వ్యక్తికి సంబంధిం–చిన సంవత్సరానికి మొదటి దినము. అతని వయస్సులో ఒక సంఖ్య క్రొత్తగా చేకూరును. అదే విధంగా నూతన సంవత్సరము అనగా సంవత్సర మొదటి (నూతన) దినము, సృష్టికి జన్మదినమని అర్థము. ఆ రోజునే ఈ జగత్తు ఉత్పన్న మైనదని అర్థం.

సమస్త జగత్తు ఉత్పన్నమై నలువైపుల సశ్యశ్యామలమైన వాతావరణం, వనస్పతులు, ఓషధులు, పుష్పఫలములతో పరిపూర్ణమైన



వృక్షములు, వివిధ విచిత్ర పశుపక్ష్యాదుల మనోరంజక ధ్వనులు, ప్రకాశ పుంజములైన సూర్య చంద్రనక్షత్రాదులతో దేదీప్యమానమైన ఆకాశము. ఇట్టి మరెన్నో ఆశ్చర్యజనకమైన విచిత్ర వింతలతో నిండి ఉన్న సృష్టిలో జన్మించిన మొట్టమొదటి మానవులకు కలిగిన అపరిమిత ఆనందాను–భూతిని ఊహించండి. ఎంత ఆహ్లాదకరమైన దినమో అది. అట్టి ఉద్భవ దినాన్ని, మానవోత్పత్తి దినాన్ని స్మరించుకోవడమే నూతన సంవత్సరమని అర్థము. ఆ రోజు నుండే సృష్టియొక్క క్రొత్త సంవత్సరం ప్రారంభ మగునని అర్థము.

ఈ సృష్టి ఉత్పన్నమై ఇప్పటకి (2071విక్రమసం॥, మార్చ్ 2014 క్రీ॥సం॥వరకు) 1,97,29,49,115సం॥లు గడిచాయి. ఈ కాల పరిగణనలో కొంత మందికి సందేహం కలుగవచ్చు. మానవులు ఇంతటి సుదీర్ఘ కాలపరిమితిని ఏవిధంగా గుర్తించారు? ఎట్లు గుర్తుంచుకో గలిగారు? అని కొందరి మనస్సు ప్రశ్నించవచ్చు. దీనికి సమాధానము అత్యంత సరళం. ప్రతి వ్యక్తి తన జన్మదినాన్ని, వయస్సును పదే పదే స్మరించు–కుంటూ గుర్తుంచుకున్నట్లుగానే సృష్టివయస్సున్నూ గుర్తించబడినది. వైదిక సంస్కృతిలో, భారతదేశ పరంపరలో మన ప్రాచీన ఋషులు మహర్షులు కొన్ని అద్భుత పద్ధతులను ఈ సమాజములో ప్రవేశపెట్టి కొనసాగించారు. ఉదాహరణకు ఏ వ్యక్తి అయిన గురువులకు, విద్వాం–సులకు, పూజ్యులకు అభివందన మొనర్చునప్పుడు, నమస్కారము చేయునప్పుడు ప్రతిసారి నమస్కరించు వ్యక్తి తన గోత్రమును, వంశమును, పితరుల నామములను, తన విద్యాపరంపరను (అనగా తన వేదము, శాఖ, సూత్రాదులను), తన యోగ్యతాదులను తెలియజేస్తూ అభివందన మొనర్చును. ఇప్పటికీ ఈ పరంపర బ్రాహ్మణులలో ఆనువంశికంగా కొనసాగుచున్నది. దీనితో గోత్రాదులను విస్మరించకుండ ఉందురు. ఆ

పరంపరను కొనసాగించని వ్యక్తులు తమ తమ గోత్రము, వంశములను మరిచిపోయి పర్వతముల, నదుల, నగరముల, వృక్షవనస్పత్యాది నామములను, మరెన్నో నిరర్థక శబ్దములను తమ గోత్రముగా చెప్పుకొనుచున్నారు. ప్రస్తుతం ఆధునిక ప్రభావంతో బ్రాహ్మణులు కూడా ఆ పరంపరను విస్మరిస్తున్నారు. అస్తు. ఇదే విధంగా సృష్టికాలాన్ని విస్మరించకుండ ఉండేందుకు మన ఋషి–మహర్షులు ప్రతి నిత్యం చేయు సంధ్యా–అగ్నిహోత్రాదులను, విశిష్ట సందర్భాలలో చేయు యజ్ఞయాగాదులను ప్రారంభించుటకు పూర్వం సంకల్పమును పఠించు పరంపరను ప్రారంభించిరి. ధార్మికకృత్య యజమానుడు లేదా పురోహితుడు ఆ సంకల్పములో సృష్టి ప్రారంభకాలం నుండి మొదలు–కొని తను పఠిస్తున్న ప్రస్తుత సమయం వరకు సమస్త కాలపరిగణను సంస్కృతభాషలో పరిగణించును. అంతయే గాక బ్రహ్మాండం మొదలుకొని తను ఆసీనుడై (కూర్చొని) ఉన్న స్థలం వరకు అనగా బ్రహ్మాండము, భూలోకము, ద్వీపము, దేశము, రాష్ట్రము, పర్వత–నదుల పరిసరములు, నగరము, గ్రామము, గృహము, స్థానము సనామముగా వ్యక్తపరుచును. తదనంతరము తనలోని శుభ మనోకామనలను వ్యక్తపరుచును. ఇదియే సంకల్పం. ఆ పరంపర ఇప్పటికీ ధార్మిక కృత్యాలలో అక్షుణ్ణంగా నడుస్తున్నది. అట్టి పరంపరలు, వైదిక సంస్కృతి, భారతదేశంలో తప్ప మరెక్కడ అన్వేషించినా కానరావు. ఈ విధంగా పరంపరగా కొనసాగుతూ వస్తున్న ఈ కాల పరిమితిని ఇప్పటి ఆధునిక వైజ్ఞానికులు కూడా బలపరుస్తున్నారు.

ఈ సృష్టి జన్మదినము అనగా నూతన సంవత్సరం (చైత్ర శుక్ల ప్రతిపద)వరకు అంతట మనకు నూతనత్వము అగుపడును. వృక్ష వనస్పతులలో ఆకులన్ని రాలిపోయి నూతన పత్ర–పుష్పములు వికసించి



ఫలాదులతో వినూతనత్వం అగుపడును. నెమలి మున్నగు పక్షులలోనూ వాటి పింఛము (ఈకలు) పడిపోయి క్రొత్త ఈకలు పరిపూర్ణంగా వికసిస్తాయి. వసంత ఋతువులో అనగా చైత్ర, వైశాఖ మాసములలో తేనెటీగలు వాటి గూడుల (తెట్టల) యందు తేనెను (మధువును) ఏకత్రితము చేసి నింపి పెట్టును.అందుకే వైదిక కాలములో చైత్ర, వైశాఖ మాసములకు మధు, మాధవములని నామములు ప్రసిద్ధి చెందెను. వసంత ఋతువు (చైత్రమాసం) సమీపించగానే కోకిల తన మధుర ధ్వనులతో జనుల మనస్సును రజింపజేస్తూ నూతన సంవత్సరానికి స్వాగతం పల్కును. కోకిల యొక్క ఈ మనోరంజక స్వాగత పలుకులను ఉద్దేశించి ఒక కవి ఈ విధంగా వర్ణించాడు–

**కాక: కృష్ణ: పిక: కృష్ణ: కో భేద: పికకాకయో: ।**
**వసంతకాలే సంప్రాప్తే కాక: కాక: పిక: పిక:॥**

కాకికోకిలలు కంటికి కృష్ణముగా (నలుపుగా)నే అగుపడును. వాటిలో ఏ తారతమ్యం (భేదం) కలదని ప్రశ్నిస్తే సమాధానమిది– వసంత ఋతువు (సంవత్సరాది) సమీపించగానే స్వ–స్వరాలతో కాకి కాకిగా, కోకిల కోకిలగా గుర్తించ బడుతాయి.

వసంతఋతువు సమీపించగానే సమస్త ప్రాణులలో నూతనశక్తి సంచరించును. వర్షాకాలానికి మరియు చలికాలానికి మధ్యలో శరద్ ఋతువు వచ్చును.ఇది ఒక ఋతుసంధికాలము. ఈ ఋతుసంధిలో అనగా భాద్రపద,ఆశ్వయుజ మాసాలలో మానవులకు వివిధ రోగములు, వ్యాధులు విశేషంగా సంభవించును,ప్రత్యేకంగా బలహీనులు అధికంగా అనారోగ్యానికి గురి అవుతారు. ఈ ఋతుసంధిలోనే చాలా మందికి మృత్యువు సంభవిస్తుంది. కావున అనారోగ్యానికి గురి గాక శరద్ ఋతువును గడిపినవారు తమకు తాము మహాభాగ్యంగా భావిస్తారు,

మృత్యుగండాన్ని తప్పించుకొన్నామని సంతోషిస్తారు. అందుకే మానవు–లందరు భగవంతునితో వేదమంత్రాల మాధ్యమంగా శరదఋతువులో సంపూర్ణ ఆరోగ్యాన్ని కలిగి ఉండాలని ప్రార్థిస్తూ ఉంటారు– **"పశ్యేమ శరద: శతమ్, జీవేమ శరద: శతమ్, శ్రుణుయామ శరద: శతమ్,** .....(యజు॰ 36.24). వంద శరద్ ఋతువుల వరకు మా సమస్త ఇంద్రియములు, శరీరం సంపూర్ణ శక్తి సామర్థ్యాలు కలిగి సుఖయుక్తంగా ఉండు గాక. మేము వంద శరద్ ఋతువులకన్న అధికంగా జీవించి ఉందుము గాక అని ఆ మంత్రానికి తాత్పర్యం. మహర్షి దయానందుడున్నూ ఈ విషయాన్ని ఇట్లు వర్ణించాడు– "ఉత్తమరీతిలో పథ్యాన్ని పాటించువారు శరద్ ఋతువులో రోగ రహితులవుదురు" (యజు॰ 21.26).

కఠోపనిషత్తులో నచికేతుడు యమాచార్యున్ని మృత్యురహస్యం తెలుపుమని మూడవ వరాన్ని కోరగ యమాచార్యుడు అనేక ప్రలోభములను చూపుతూ **"స్వయం చ జీవ శరదో యావదిచ్ఛసి .....నచికేతో! మరణం మానుప్రాక్షీ:** (కఠో॰ 1.1.23,25) ఓ నచికేత! నీవు ఎన్ని శరద్ ఋతువుల వరకు జీవించ దలిచావో, అన్ని సంవత్సర–ముల వరకు జీవించుటకు దీర్ఘాయువును కోరుకో, కాని మృత్యు–రహస్యాన్ని మాత్రం ప్రశ్నించకుము" అని చెప్పి మభ్యపెట్టుటకు ప్రయత్నించెను. ఇదే విధంగా వైదిక సాహిత్యంలో అనేకానేక ప్రసంగాలలో శరద్ ఋతువు మానవ జీవనానికి ఒక కంటకము వలె గోచరించును. కాని అట్టి ప్రమాదము అనగా మృత్యుగండము, అనా–రోగ్యభయం వసంత ఋతుసంధిలో అనగా ఫాల్గునం, చైత్ర మాసాల సంధిలో జరుగదు. ఈ ఋతు ప్రారంభంలో అనారోగ్యము, మృత్యువుకు బదులుగా అందరి శరీరాలలో వినూతన చైతన్యము, సంతోషము,



ఆరోగ్యములే అగుపడును.

వసంత ఋతువు ప్రవేశముతో వాతావరణం, ఆకాశం అత్యంత నిర్మలంగా ఉండును, అపరిమిత ఆహ్లాదయుక్తమై ఉండును. ఈ ఋతువులో సూర్యుడు భూమధ్య రేఖపై చేరును. దానితో వాతావరణ–ములో సమశీతోష్ణములు ఏర్పడును. భూగోళమంతట సమస్త మానవులకు సూర్యదర్శనమగును. రాత్రింబవళ్లు సమానంగా ఉండును. వాటి యందు హెచ్చుతగ్గులు ఉండవు. ఈ విధంగా నిఖిల ప్రకృతిలో నవత్వం వ్యాపించబడి ఉండును. సమస్త జగత్తులో వ్యాపించబడి ఉన్న నూతనాన్ని అనుసరిస్తూ అఖిల మానవులందరు ప్రాచీనకాలంలో ఈ దినమును సంవత్సర మొదటి దినముగా, ఒక పర్వదినముగా జరుపుకునేవారు. ఆ పరంపర ఆంధ్రప్రదేశంలో 'యు(ఉ)గాది' (యుగానికి మొదటి దినము)గా, జమ్మూకశ్మీరులో 'నవరేహ'గా, అస్సాం ప్రాంతములో 'రోంగలి' పర్వంగా, కేరళ్‌లో 'విశు' దినంగా, ఈ విధంగా వివిధ రాష్ట్రాలలో భిన్న భిన్న నామములతో కొనసాగుతుంది. ఈరాను, ఈరాక్ దేశాలలో 'నౌరోజు' (=నవదినము, సంవత్సర మొదటి దినము)గా అచటి ప్రజలు నూతన సంవత్సరాన్ని జరుపుకొనుచున్నారు. ఈ విధంగా వసంత ఋతువు ప్రారంభమగు దినమున అనగా చైత్ర శుక్ల ప్రతిపద (పాడ్యమి) రోజున నూతన సంవత్సరమును జరుపుకొనుట ప్రకృతికి, సూర్య చంద్రాది స్థితిగతులకు అనుకూలమైనది, వైజ్ఞానికమైనది, బుద్ధి సమ్మతమైనది.

వేదాలలోనూ వసంత ఋతువుతో సంవత్సరము (కాలపరిగణన) ప్రారంభమగునట్లు ఉపదేశించబడినది– **"మధుశ్చ మాధవశ్చ వాసన్తికావృతూ శుక్రశ్చ శుచిశ్చ గ్రైష్మావృతూ నభశ్చ నభస్యశ్చ వార్షికావృతూ ఇషశ్చోర్జశ్చ శారదావృతూ సహశ్చ సహస్యశ్చ**

**హైమన్తికావృతూ తపశ్చ తపస్యశ్చ శైశిరావృతూ** (తైత్తిరీయ సంహిత 4.4.11.1; 1.4.14). ఈ మంత్రములో స్పష్టంగా వసంత ఋతువు నుండి మొదలుకొని శిశిర ఋతువు వరకు ఆరు ఋతువులు వర్ణించబడినవి. ప్రతి ఋతువు రెండు–రెండు నెలలుగా విభజించబడినది. సృష్టి ఆదిలోనే వేదములందు సంవత్సరం పన్నెండు మాసములుగా, ఆరు ఋతువులుగా విభజింపబడి ఉంది. పాశ్చాత్యులవలె పది మాసములు నుండి పన్నెండు మాసములుగా కాలపరిగణన వికాసము జరుగలేదని ఇచట విశేషంగా గ్రహించదగిన విషయం.

వైదిక కాలములో మాసములకు మధు, మాధవ అను నామములు ఉండేవి. కాలాంతరములో అవి నక్షత్రముల నామములతో ప్రచలితమైనవి. నాక్షత్రిక నామముల ఆధారమును మహర్షి పాణిని స్వవిరచితమైన అష్టాధ్యాయి అను వ్యాకరణ గ్రంథంలో ఈవిధంగా వర్ణించాడు **"సాస్మిన్ పౌర్ణమాసీతి"** (4.2.20) పూర్ణిమా దినమునందు చంద్రుడు ఏ నక్షత్రముతో కలిసి ఉండునో అదే నక్షత్ర నామముతో ఆ మాసమునకు నామకరణం చేయబడునని దాని అర్థం. ఉదాహరణకు పూర్ణిమా దినమున చంద్రుడు చిత్రా నక్షత్రముతో కలిసి ఉంటే ఆ మాసమునకు చైత్రమాసమని పేరు. విశాఖ నక్షత్రముతో కలిసి ఉంటే వైశాఖ మాసమని పేరు. జ్యేష్ఠ నక్షత్రముతో ఉంటే ఆ మాసానికి జ్యేష్ఠము అని పేరు. ఇదే విధంగా ఉత్తరాషాఢ నక్షత్రముతో ఆషాఢ మాసము, శ్రవణ నక్షత్రముతో శ్రావణమాసము, ఉత్తరభాద్రపద నక్షత్రముతో భాద్రపదమాసము, అశ్విని నక్షత్రముతో ఆశ్విన (ఆశ్వీయుజ) మాసము, కృత్తికా నక్షత్రముతో కార్తికమాసము, మృగశిర నక్షత్రముతో మార్గశీర్షమాసము, పుష్య నక్షత్రముతో పౌషమాసము, మఘా నక్షత్ర–ముతో మాఘమాసము, ఫాల్గున నక్షత్రముతో ఫాల్గునమాసముల



నామములు ఏర్పడినవి. మాసముల పేర్లను స్మరించగానే, ఉచ్చరించగానే ఆకాశములోని గ్రహనక్షత్రముల స్థితిగతులు బోధపడును. దీనితో మనపూర్వజులకు ఖగోళశాస్త్ర పరిజ్ఞానం ఎంత ఉండిందో స్పష్టమగు–చున్నది. ఇది గర్వించదగిన విషయం.

మాసముల వైదిక నామములు, ప్రస్తుతం ప్రచలితముగా ఉన్న నాక్షత్రిక నామములు ఋతువులతో సహా క్రింది పట్టికలో చూడుడు–

| **వైదిక నామములు** | **నాక్షత్రిక నామములు** | **ఋతువులు** | **అయనములు** |
|---|---|---|---|
| మధు,మాధవ | చైత్రము,వైశాఖము | వసంత | ఉత్తరాయణము |
| శుక్ర,శుచి | జ్యేష్ఠము,ఆషాఢము | గ్రీష్మ | ఉత్తరాయణము |
| నభస్,నభస్య | శ్రావణము,భాద్రపదము | వర్ష | దక్షిణాయనము |
| ఇష,ఊర్జ | ఆశ్వయుజము,కార్తికము | శరద | దక్షిణాయనము |
| సహస్,సహస్య | మార్గశీర్షము,పౌషము | హేమన్త | దక్షిణాయనము |
| తపస్,తపస్య | మాఘము,ఫాల్గునము | శిశిర | ఉత్తరాయణము |

ఈ విధంగా సంవత్సరం మాసములుగా మరియు ఋతు–వులుగా విభజింపబడును–**"ద్వే రూపే సంవత్సరస్య మాసా అన్యద్ ఋతవో"** (కాఠక సంహిత 34.7). ఋతు విభాగం వసంత ఋతువుతోనే ఆరంభమగునని మన మహర్షులు నిర్ణయించారు–**"ముఖం వా ఏతదృతూనాం యద్ వసన్తః"** (తైత్తిరీయబ్రాహ్మణము 1.1.2.6,7). ఋతువులలో వసంతఋతువు ముఖం వంటిది. ప్రథమ స్థానం కలదని ఆ వాక్యమునకు అర్థం. ఇదే విధంగా వేదాది సమస్త శాస్త్రాలలో వసంత ఋతువుతో సంవత్సరం ప్రారంభమగునని స్పష్టంగా వర్ణించబడింది.[1] కావున చైత్ర శుక్ల పాడ్యమి రోజున నూతన సంవత్సరమును జరుపుకోవడమే వేదాది శాస్త్రాలకు అనుకూలము,

1.ఈ విషయంలో చూడదగిన బ్రాహ్మణగ్రంథాల ప్రసంగాలు–తాండ్యమహా బ్రా॰ 5.9.11; కౌషీతకీ బ్రా॰ 5.1; శాంఖాయన బ్రా॰ 19.3.

భారతీయ సంస్కృతికి సమ్మతము. మనమందరం ఆంగ్లక్యాలెండర్‌కు మానసికంగా బానిసలమై దానితోనే వ్యవహారాన్ని కొనసాగించినా వివాహం, జన్మదినం, అక్షరాభ్యాసం, గృహప్రవేశం, వ్యాపారం వంటి సమస్త శుభకార్యాలన్ని ప్రారంభించినప్పుడు మాత్రం భారతీయ పంచాంగాన్నే ఆశ్రయించెదము. కానీ ఆంగ్లక్యాలెండరును ఎవరునూ, ఎన్నడునూ ఆశ్రయించరు. ఇదియే భారతీయ సంస్కృతి యొక్క అమరత్వం.

సూర్యునికి భూమికి మధ్యలో చంద్రుడు వచ్చినప్పుడు ఈ మూడు ఒకే సమాన రేఖపై ఉండును. ఈ స్థితియే అమావాస్య అనుబడుతుంది. చంద్రుని వేగము అధికంగా ఉన్నందు వలన అది సూర్యుని కంటే ముందుకు వెళ్ళుతుంది. సూర్య చంద్రుల మధ్య 12°అంశముల (డిగ్రీల) దూరం కలిగినప్పుడు అది ఒక తిథి (దినము) అనబడుతుంది. ఈ విధంగా సూర్య చంద్రుల మధ్య దూరము 12, 24, 36,....అంశములు పెరుగుతూ, పెరుగుతూ మరల ఒకే రేఖ పై వచ్చేవరకు అనగా ఒక పరిక్రమ పూర్తియై వృత్తము ఏర్పడు వరకు (360°÷12°=) 30 తిథులు (దినములు) అగును. అనగా ఒక మాసము పూర్తి అగును. ఈ విధంగా ఒక అమావాస్య నుండి మరో అమావాస్య వరకు ఒక మాసము (30 దినములు)[2.] పూర్తి అగును. పన్నెండు మాసములకు ఒక సంవత్సరమని వేదమంత్రం ద్వారా ఇంతకు పూర్వం తెలిసికొంటిమి. అనగా ఒక సంవత్సరములో (12 నెలలు×30 దినములు) 360 దినములు ఏర్పడును. ఈ విషయమున్నూ వేదమంత్రములో వర్ణించబడింది. **"యే త్రిషప్తా: పరియన్తి విశ్వా రూపాణి బిభ్రత:..."** (అథర్వం 1.1.1). "త్రిషప్తా:" అను శబ్దమునకు మూడు విధముల అర్థము

2. షష్ఠిర్మాసస్యాహోరాత్రాణి (శతపథం 6.2.2.35) ఒక మాసములో అరువది రాత్రి-పగలు ఉండును అనగా ముప్పది దినములు ఉండునని దానికి అర్థము.



కలదు.

1) మూడు నుండి ఏడు వరకు గల విషమ సంఖ్యల యోగము–

| | | |
|---|---|---|
| | 3+5+7 | = 15 |
| 2) మూడు సార్లు ఏడు | 3×7 | = 21(+) |
| | | 36 |
| 3) మూడు ఏడుల యోగము | 3+7 | = 10(×) |
| | 36×10 | = 360 |

ఈ విధంగా ఒక సంవత్సరములో 360 దినములు ఉండునని వేదము సృష్ట్యాదిలోనే మానవులకు ఉపదేశించినది.

మరొక మంత్రము చూడుడు–

**ద్వాదశ ప్రధయశ్చక్రమేకం త్రీణి నభ్యాని క ఉ తచ్చికేత ।**
**తస్మిన్త్సాకం త్రిశతా న శంకవోఽర్పితా: షష్టిర్న చలాచలాస:॥**

(ఋగ్వేదం 1.164.48)

సంవత్సర మనే చక్రంలో పన్నెండు మాసము లనే అరెలు ఉండును. ప్రముఖమైన గ్రీష్మ, వర్ష, శరద ఋతువు లను మూడు నాభ్యము లుండును. 360 దినములను చలాచల మేకులు ఉండును. అట్టి కాలచక్రం నిరంతరం గతి యొనర్చుచుండును. అని ఈ మంత్రమునకు అర్థం.

ఇదే విధంగా బ్రాహ్మణాది గ్రంథాలలో పలు చోట్ల సంవత్సరములో 360 దినములు ఉండునని స్పష్టంగా వర్ణించబడి ఉంది–**త్రీణి చ హ వై శతాని షష్టిశ్చ సంవత్సరస్యాహోరాత్రాణి** (గోపథ బ్రాహ్మణము 1.5.5).

కాలపరిగణన మానవీయ సంవత్సరములోనూ, బ్రాహ్మ–

సంవత్సరములలోనూ చేయబడినట్లుగా శాస్త్రాలలో అగుపడుతుంది. బ్రాహ్మసంవత్సరం గురించి ఇచట సంక్షిప్తంగా పరిచయ రూపంలో వర్ణిస్తున్నాము. ఈ సృష్టి యొక్క స్థితికాలం మరియు ప్రళయావస్థకాలమును కలిపి ఒక బ్రాహ్మదివసం అనబడుతుంది. దీని పరిమాణం మానవీయ కాలపరిగణనలో 4,32,00,00,000 సం॥లు ఉండును. అట్టి ముప్పది (30) బ్రాహ్మదివసములు ఒక బ్రాహ్మమాసం అనబడును. పన్నెండు బ్రాహ్మమాసములే ఒక బ్రాహ్మసంవత్సరం అనబడును. వంద బ్రాహ్మసంవత్సరాలకు పరాంత కాలమని పేరు. ఒక బ్రాహ్మసంవత్సరంలో (12×30=360) మూడు వందల అరువై బ్రాహ్మదివసములు ఉండును. పరాంతకాలంలో (360×100=36,000) ముప్పది ఆరు వేల బ్రాహ్మదివసములు ఉండునని అర్థం. దీనినే మహర్షి దయానందుడు మోక్షకాలంగా వర్ణించాడు. ముక్తాత్మ పరాంతకాలం వరకు అనగా ముప్పై ఆరు వేల సార్లు ఈ సృష్టి ఉత్పన్నమై నశించునంత వరకు పరమాత్ముని ఆనందానుభూతిని పొంది మళ్ళీ జన్మించును అని వారి ఆశయం, అస్తు. బ్రాహ్మసంవత్సరంలోనూ 360 దినములే ఉంటాయని మన శాస్త్రములు, ఋషి-మహర్షులు అంగీకరించారు అనేది ఇచట గ్రహించదగిన విషయం.

భారతీయ గణిత పద్ధతిలో కాలపరిగణన రెండు విధాలుగా చేయబడుతుంది- 1. సౌరమానము, 2. చాంద్రమానము. చంద్రుడు భూమికి నలువైపులుగా పరిక్రమించుటకు 29.5 దినములు పట్టును. ఇది చాంద్రమాసము అనబడుతుంది. పన్నెండు చాంద్రమాసములకు ఒక చాంద్రసంవత్సరము ఏర్పడును. దీనిలో 29.5×12= 354 దినములు ఉండును. కాని సౌరమానం ప్రకారం ఒక సంవత్సరములో భూమి



సూర్యునికి నలువైపులుగా పరిభ్రమించుటకు 365.25 దినములు పట్టును. ఈవిధంగా చాంద్రసంవత్సరము మరియు సౌర సంవత్సరములో 11.25 దినముల భేదము కలదు. ఈ భేదము ప్రతి 32 మాసముల తర్వాత చాంద్రసంవత్సరమును 13మాసములుగా చేసి ఆ భేదం సమానంగా చేయబడుతుంది. ఈ 13వ మాసమే అధిమాసము, (అధిక మాసము) అనబడుతుంది. ఈ విధంగా సంవత్సరములో 12 మాసములు లేదా (అప్పుడప్పుడు) 13 మాసములు ఉండుననే ఈ విషయం బ్రాహ్మణగ్రంథాలలో మన మహర్షులు స్పష్టపరిచారు- **"ద్వాదశ వా వై త్రయోదశ వా సంవత్సరస్య మాసా:"** (శతపథ బ్రాహ్మణం 2.2.3.27). చంద్రుని వలన మాసములు ఏర్పడటం చేత చంద్రునికి **"మాసకృత్"** అనే పేరు వేదాలలో (ఋగ్వేదము 1.105.18) అగుపడుతుంది.

ఈవిధంగా భారతీయ గణన సూర్యచంద్రుల స్థితిగతులను అనుసరించి వ్యవహరించ బడుతుంది. మన కాలాంతరము (క్యాలెండర్) ఖగోళ విజ్ఞానానికి సమన్వితమైనది. ప్రాకృతిక ఘటనలకు సంబంధితమైన పరిజ్ఞానము ఎప్పుడున్నూ అసత్యము కాజాలదు. ఉదాహరణకు సూర్య-గ్రహణము ఎప్పుడైన అమావాస్యకే జరుగును. అదే విధంగా చంద్ర-గ్రహణం పూర్ణిమ (పున్నమి) రోజునే జరుగును. ఈ విధంగా ఆధునిక విజ్ఞానం లేకున్నా ప్రాకృతిక పరిజ్ఞానం కలవారికి కాలాంతరము (క్యాలెండర్) లేకుండానే చంద్రున్ని చూసి మాసము, శుక్లపక్షము, కృష్ణపక్షము, పూర్ణిమ, అమావాస్య, తిథుల పరిజ్ఞానము కలుగును. అర్ధచంద్రునితో అష్టమి తిథి తెలియును. కానీ ఆధునిక విద్యావంతులకు పాశ్చాత్య క్యాలెండర్ లేకుండా ఎవరికి కూడా తిథ్యాదుల పరిజ్ఞానము ఏమాత్రం కలుగ జాలదు.

చైత్ర శుక్ల పాడ్యమి రోజు సృష్టి ఉత్పన్నం కావడం వలన ఇది సంవత్సరమునకు మొదటి దినము, ఈ దినమే నూతన సంవత్సరం ప్రారంభమగును. ఇదియే యు(ఉ)గాది అని తెలిసికొంటిమి. ఈ సంవత్స–రానికి ఉన్న మరికొన్ని విశేషతలను, ప్రత్యేకతలను తెలుసుకుందాము–

1. **చైత్రే మాసి జగద్ బ్రహ్మ ససర్జ ప్రథమేహని ।**
**శుక్లపక్షే సమగ్రే తు సదా సూర్యోదయే సతి ॥** (హిమాద్రి)

చైత్ర మాస శుక్లపక్ష మొదటి సూర్యోదయ దినం వరకు పరమేశ్వరుడు సమగ్ర సృష్టిని ఉత్పన్నము చేసి మానవులను సృజించెను. అందుకే దీనికి సృష్టిసంవత్సరమనీ, మానవసంవత్సరమనీ పేరు.

2. ఈ రోజే పరమాత్ముడు మానవుల సర్వవిధ కల్యాణం నిమిత్తము అగ్ని, వాయువు, ఆదిత్య, అంగిర అను నల్గురు ఋషుల అంత:కరణములలో వేద జ్ఞానమును ప్రసాదించెను.కావున దీనికి వేద సంవత్సరమని కూడా నామము కలదు.

3. ఈ దినమే కలియుగ సంవత్సరం ప్రారంభమగును.

4. ఈ దినమే యుధిష్ఠిరుని(ధర్మరాజుని) రాజ్యాభిషేకము జరిగినది. అందుకు ఈ నవసంవత్సర దినముననే యుధిష్ఠిర సంవత్సరం కూడ ప్రారంభమవుతుంది.

5. అత్యంత పరాక్రమి, ధర్మాత్ముడు, న్యాయప్రియుడైన విక్ర–మాదిత్యుని నామముతో ప్రచలితమైన సంవత్సరమున్నూ ఇదే దినమున ఆరంభమవుతుంది.

6. శాలివాహనుడు హూణులను పరాజితము చేసి దక్షిణ భారతదేశములో అత్యుత్తమ ధార్మిక రాజ్యాన్ని ఈ దినమే స్థాపించాడు. అప్పటి నుండి శాలివాహన శక సంవత్సరమున్నూ ఆరంభించబడినది.



ఆ సంవత్సరం కూడా ఈ రోజే నూతనముగా ఆరంభమవుతుంది.

7. మహర్షి దయానందుడు వేదధర్మపరిరక్షణకై, భారతీయ ప్రాచీన సంస్కృతిని సంరక్షించుటకై, మానవసమాజ మహోన్నతికై ఇదే రోజున ఆర్యసమాజాన్ని స్థాపించాడు.

8. ఈ నూతన సంవత్సరానికి సమీపములోనే అనగా చైత్ర శుక్ల నవమి రోజున మర్యాదపురుషోత్తముడైన శ్రీరాముని రాజ్యాభిషేకం జరిగినది. అది శ్రీరాముని 52వ జన్మదినం కూడా.

## నూతన సంవత్సర సందేశములు

ఈ నూతన సంవత్సర సందేశములను గ్రహించి, వాటిచేత ప్రేరితులమై మనం ఈ పర్వమును మహదానందముతో ఇట్లు జరుపుకొనుటకు ప్రయత్నించెదము, రండి.

1. ఇది సృష్టిఉత్పత్తి దివసము. ఉత్పన్నమైనపుడు ఈ సృష్టి ఏ విధంగానైతే అత్యంత శుద్ధపరిశుద్ధంగా (నిర్మలంగా), సమస్త ప్రాణులకు ఆరోగ్యప్రదాయినిగా, సశ్యశ్యామలంగా మనోహరంగా ఉండెనో అదే విధంగా నిలుపు కొనుటకు, సంరక్షించుటకు కంకణబద్ధులమవుదాము. వాతావరణ కాలుష్యాన్ని నివారించుటకు వృక్షములను, వనసంపదలను కాపాడుతూ వాటిని ఇంకా అభివృద్ధి గావించుదాము. నదులను, పశు పక్ష్యాదులను రక్షించుకుందాము. యజ్ఞ–యాగాదులను అనుష్ఠించుదాము.

2. ఇది మానవ సంవత్సరము. మానవులందరు ఒకే భగవంతుని సంతానము. కావున అందరూ కుల, మత, దేశ, లింగాది భేదములు లేకుండ ఈర్ష్య, ద్వేష, అసూయాదులను వదిలి పరస్పరము అత్యంత ప్రీతి, ప్రేమ, ఆప్యాయత, అనురాగములతో కలిసికట్టుగా ఉండి మానవత్వాన్ని చాటి చూపుదాము. **"వసుధైవ కుటుంబకం"** నిఖిల–

జగత్తంతయు ఒకే కుటుంబము, ఒకే పరివారంగా వ్యవహరించుదాము.

3. ఇది వేదసంవత్సరము. వేద ధర్మము, వైదిక సంస్కృతి భూమండలమంతటా వ్యాపించి ఉన్నంత వరకు మానవులందరూ సర్వవిధ సిరిసంపదలతో, సుఖశాంతులతో సంతృప్తిగా పరిపూర్ణులై ఉండిరి. వివిధ సమయాలలో స్వార్థ పరాయణులైన మానవుల ద్వారా నెలకొల్పిన సాంప్రదాయక సిద్ధాంతములను, విభేదములను విడనాడి భగవత్–ప్రదత్తమైన దివ్య వేదజ్ఞానాన్ని అర్జించి, ఆచరించి, అనుసరించి ఋషి, మహర్షుల వలె మరియు శ్రీరాముడు, శ్రీకృష్ణునివంటి మహాపురుషులవలె సుఖశాంతులను పొంది ఒక దివ్యమానవ సమాజాన్ని స్థాపించుదాము.

4. ఇది శ్రీరాముడు, యుధిష్ఠిరుడు (ధర్మరాజు), విక్రమాదిత్యుడు, శాలివాహనునివంటి ధర్మపరాయణులైన మహారాజుల ధర్మరాజ్య సంస్థాపన దినం. అధర్మం, అన్యాయం, అత్యాచారం, అనాచారం, దురాచారం, భ్రష్టాచారం, అవనీతి లాంటి రాక్షస, పిశాచ, నీచ భావనలతో భగభగమని మండుచున్న భ్రష్టరాజనీతిని భస్మము చేసి ధర్మరాజ్య సంస్థాపనకు కదలి రండి, మేలుకొనండి, మేలుకొల్పండి. **"ధర్మో రక్షతి రక్షిత:"** (గీత) ధర్మాన్ని రక్షిస్తే ధర్మం మనల్ని రక్షిస్తుంది. **"యతో ధర్మస్తతో జయ:"** (గీత) ధర్మము ఉన్నచోటనే జయము, సుఖశాంతలు విరాజిల్లును.

5. ఇది ఆర్యసమాజస్థాపన దినము. ఆర్యులు అనగా శ్రేష్ఠులు, సమాజము అనగా మానవత్వము గలవారి సముదాయమని అర్థం. ఆర్యసమాజ మనగా ఉత్తమోత్తమమైన మానవుల సమాజమని అర్థం. **"కృణ్వంతో విశ్వమార్యమ్"** (ఋ. 9.63.5 ) జగత్తులో వ్యాపించివున్న దుష్టశక్తులను, దుర్భావనలను దగ్ధం చేసి (భస్మం చేసి) సమస్త విశ్వమును



ఆర్యులుగా, దివ్యమానవ సమాజముగా తీర్చి దిద్దుటకు కదలిరండి. సంకుచిత భావాలను అజ్ఞానాంధకారాలను, ఢాకిని, పిశాచిని, యంత్ర, మంత్ర, తంత్రాది మూఢనమ్మకాలను సమూలంగా నశింపజేసి మానవులందరిని జ్ఞానవంతులుగా చేయుదము రండి.



## సంవత్సర నామములు

ప్రభవో విభవ: శుక్ల: ప్రమోదోఽథ ప్రజాపతి: ।
అంగిరా: శ్రీముఖో భావో యువా ధాతేశ్వరస్తథా ॥
బహుధాన్య: ప్రమాథీ చ విక్రమోఽథ వృషస్తథా ।
చిత్రభాను: సుభానుశ్చ తారణ: పార్థివో వ్యయ: ॥
సర్వజిత్ సర్వధారీ చ విరోధీ వికృతి: ఖర: ।
నందనో విజయశ్చైవ జయో మన్మథదుర్ముఖౌ ॥
హేమలంబీ విలంబీ చ వికారీ శార్వరీ ప్లవ: ।
శుభకృచ్ఛోభన: క్రోధీ విశ్వావసుపరాభవౌ ॥
ప్లవంగ: కీలక: సౌమ్య: సాధారణవిరోధకృత్ ।
పరిధావీ ప్రమాదీ చ ఆనందో రాక్షసోఽనల: ॥
పింగల: కాలయుక్తశ్చ సిద్ధార్థో రౌద్రదుర్మతీ ।
దుందుభీ రుధిరోద్గారీ రక్తాక్షీ క్రోధన: క్షయ: ॥

1. ప్రభవ
2. విభవ
3. శుక్ల
4. ప్రమోద
5. ప్రజాపతి
6. అంగిరా
7. శ్రీముఖ
8. భావ
9. యువా
10. ధాతా
11. ఈశ్వర
12.బహుధాన్య
13. ప్రమాథీ
14. విక్రమ
15. వృష
16. చిత్రభాను
17. సుభాను
18. తారణ
19. పార్థివ
20. వ్యయ
21. సర్వజిత్
22. సర్వధారీ
23. విరోధీ
24. వికృతి
25. ఖర
26. నందన
27. విజయ
28. జయ
29. మన్మథ
30. దుర్ముఖ
31. హేమలంబీ
32. విలంబీ
33. వికారీ
34. శార్వరీ
35. ప్లవ
36. శుభకృత్
37. శోభన
38. క్రోధీ
39. విశ్వావసు
40. పరాభవ
41. ప్లవంగ
42. కీలక
43. సౌమ్య
44. సాధారణ
45. విరోధకృత్
46. పరిధావీ
47. ప్రమాదీ
48. ఆనంద
49. రాక్షస
50. అనల (నల)
51. పింగల
52. కాలయుక్త
53. సిద్ధార్థి
54. రౌద్ర
55. దుర్మతి
56. దుందుభీ
57. రుధిరోద్గారీ
58. రక్తాక్షీ
59. క్రోధన
60. క్షయ





# ప్రసిద్ధ సంవత్సరములు

## భారతీయ సంవత్సరములు

| | | |
|---|---|---|
| 1. సృష్టి సంవత్సరము | ........ | 1,97,29,49,115 |
| 2. శ్రీరామ సంవత్సరము | ........ | 1,25,69,115 |
| 3. శ్రీకృష్ణ సంవత్సరము | ........ | 5,240 |
| 4. యుధిష్ఠిర/కలియుగ సంవత్సరము | ........ | 5,115 |
| 5. బౌద్ధసంవత్సరము | ........ | 2,589 |
| 6. మహావీర (జైన) సంవత్సరము | ........ | 2,541 |
| 7. శంకరాచార్య సంవత్సరము | ........ | 2,294 |
| 8. విక్రమ సంవత్సరము | ........ | 2,071 |
| 9. శాలివాహన (శక) సంవత్సరము | ........ | 1,936 |
| 10. కలచురీ సంవత్సరము | ........ | 1,766 |
| 11. వలభీ సంవత్సరము | ........ | 1,694 |
| 12. ఫసలీ సంవత్సరము | ........ | 1,425 |
| 13. బంగలా సంవత్సరము | ........ | 1,421 |
| 14. హర్ష సంవత్సరము/హర్షాబ్దము | ........ | 1,407 |

## విదేశీయ సంవత్సరములు

| | | |
|---|---|---|
| 1. చైనా సంవత్సరము | ........ | 9,60,02,312 |
| 2. ఖతాఈ సంవత్సరము | ........ | 8,88,38,385 |
| 3. పారసీ సంవత్సరము | ........ | 1,89,982 |
| 4. మిస్రీ సంవత్సరము | ........ | 27,668 |
| 5. తుర్కీ సంవత్సరము | ........ | 7,621 |
| 6. ఆదమ్ సంవత్సరము | ........ | 7,366 |
| 7. ఈరానీ సంవత్సరము | ........ | 6,019 |
| 8. యహూదీ సంవత్సరము | ........ | 5,775 |
| 9. ఇబ్రాహీమ్ సంవత్సరము | ........ | 4,454 |
| 10. మూసా సంవత్సరము | ........ | 3,718 |

11. యూనాని సంవత్సరము ........ 3,587
12. రోమన్ సంవత్సరము ........ 2,765
13. బ్రహ్మ సంవత్సరము ........ 2,555
14. మలయకేతు సంవత్సరము ........ 2,326
15. పార్థియన్ సంవత్సరము ........ 2,261
16. క్రీస్తు సంవత్సరము ........ 2,014
17. జావా సంవత్సరము ........ 1,940
18. హిజరీ సంవత్సరము ........ 1,384



## రాశి,ఋతువుల కాలములు

| రాశులు | ఋతువులు | ఆంగ్ల | ఆంగ్ల |
|---|---|---|---|
| మీనము–మేషము<br>వృషభము–మిథునము | వసంత<br>గ్రీష్మ | ఫిబ్రవరి–మార్చి<br>ఏప్రిల్–మే | గ్రీష్మ |
| కర్కము–సింహము<br>కన్య–తుల | వర్ష | జూన్–జూలై | వర్ష |
| వృశ్చికము–ధను<br>మకరము–కుంభము | హేమంత<br>శిశిర | అక్టోబర్–నవంబర్<br>డిసెంబర్–జనవరి | శీత |



## రాశులు మరియు నక్షత్రములు

| రాశులు | నక్షత్ర సం. | నక్షత్రములు | రాశులు | నక్షత్ర సం. | నక్షత్రములు |
|---|---|---|---|---|---|
| మేషము | 1<br>2<br>3 | అశ్విని (1)<br>భరణి (1)<br>కృత్తిక (1/4) | తుల | 15<br>16 | చిత్ర (1/2)<br>స్వాతి (1)<br>విశాఖ (3/4) |
| వృషభము | 4<br>5 | కృత్తిక (3/4)<br>రోహిణి (1)<br>మృగశిర (1/2) | వృశ్చికము | 17<br>18 | విశాఖ (1/4)<br>అనురాధ (1)<br>జ్యేష్ఠ (1) |
| మిథునము | 6<br>7 | మృగశిర (1/2)<br>ఆర్ద్ర (1)<br>పునర్వసు (3/4) | ధను | 19<br>20<br>21 | మూల (1)<br>పూర్వాషాఢ (1)<br>ఉత్తరాషాఢ (1/4) |
| కర్కము | 8<br>9 | పునర్వసు (1/4)<br>పుష్య (1)<br>ఆశ్రేష/ఆశ్లేష (1) | మకరము | 22<br>23 | ఉత్తరాషాఢ(3/4)<br>శ్రవణం (1)<br>ధనిష్ఠ (1/2) |
| సింహము | 10<br>11<br>12 | మఘ (1)<br>పూర్వాఫల్గుని (1)<br>ఉత్తరాఫల్గుని(1/4) | కుంభము | 24<br>25 | ధనిష్ఠ (1/2)<br>శతభిష (1)<br>పూర్వాభాద్రపద(3/4) |
| కన్య | 13<br>14 | ఉత్తరాఫల్గుని(3/4)<br>హస్త (1)<br>చిత్ర (1/2) | మీనము | 26<br>27 | పూర్వాభాద్రపద(1/4)<br>ఉత్తరాభాద్రపద(1)<br>రేవతి (1) |

$360^\circ$ అంశముల ఆకాశీయ గోళములో $30^\circ$ అంశముల చొప్పున 12 రాశులు ఏర్పడును. ప్రతి రాశిలో 21/4 నక్షత్రములు ఉండును.

**సూచన:–**మాసముల వైదిక మరియు నాక్షత్రిక నామములు ఋతువుల, అయనములతో సహ వివరణ పట్టిక పుట 20లో చూడగలరు.